శ్రీరస్తు.




శ్రీ రామచంద్రాయనమః

# మనోహితము

ఇది

చదువుల వీరరాజుచే

రచియింపంబడి

లానోట్సు ముద్రాక్షరశాలయందు
ముద్రింపంబడియె..



పార్వతీపురం.

మొదటికూర్పు.



1911. [వెల-౧ అణా,

శ్రీరామచంద్రాయనమః

# మనోహితము

శా॥ శ్రీరామా! జనకాత్మజా రమణ!
రాజీవాక్ష! దామోదరా!
యేరాకేశవ! మాధవా! వరద!
నీవే దిక్కుఁ బ్రోవంగ నం।
సారాంభోనిధినుండి తేల్చి మము
నీసాన్నిధ్యముం జేర్పుమా।
శౌరీ! కృష్ణ! యటంచు మూఢమనసా
శక్తిన్ హరిం గొల్వుమా॥ 1

మ॥ ధనముల్ గూర్చితి సంతతిన్ బడసినే
ధన్యాత్ముఁడన్ బొందినా
వనిలో నుబ్బియు విఱ్ఱవీగుటది యేలా?
సంతతుల్ సంపదల్।
కనులన్ మూసిన “టాపుటూపుగ”
నిరాఘాటమ్ముగాఁ బోవునో।
మనసా! మోక్షము హస్తమందిముడు
వేమారున్ హరిన్ గొల్వుమా॥ 2.

మ॥ మొలకల్ బుట్టియు దీర్ఘమై యెగసి
గుంపుఁ గూడి వృక్షమ్ములన్ ।
నలుదిక్కుల్ పడి యల్లి చుట్టుకొని
కానం బ్రాకుఁ దీవల్ గతిన్ ।
గలతం బొందఁగవృత్తి యాశలు
యహంకారం బటంచున్ భువిన్ ।
భళి! యిట్లల్లఁగనేల? మూఢహృదయా!
భక్తిన్ హరిం గొల్వుమా॥ 3.
మ॥ కనులన్ జూచిన వెల్లఁ గోరుచునులో
గానెంతో మూర్ఖంపుప।
ట్టున పాపంబిది పుణ్యమిద్దియిది
గాచున్ గూడదంచున్ ధరన్ ।
మనసం బేమియులేక గ్రుడ్డివలెదు
ర్మార్గంబుకే ద్రిప్పుదో।
మనవా బుద్బుద ప్రాయమాఁగనుఁ గదు
సంసక్తిన్ హరిన్ గొల్వుమా॥ 4.
శా॥ నీవున్నన్ జగముండుఁ దానివలనన్
దీపించుఁ గర్మంబులా।
త్రోవన్ గల్గును జన్మముల్ భువిమహా
దుఃఖంబులున్ గుంపులై।
తేవన్ గల్గును నీవుపోవ జగముల్
డిందున్ గదా! కర్మతో।

వేవేగన్ జని భక్తితోడ నెనయన్

వేడ్కన్ హరిన్ గొల్వుమా॥ 5.

మ॥ ఒకటి న్గోరియు లభ్యమైన బిదపన్

యొక్కొక్కటిన్ మెల్లగా।

సకలంబున్ దుదకిచ్చ యింతువటులన్

సంతుష్టిలేకుండ నో।

క్కొకరీతిన్ జరియించి దుఃఖవసధి

న్సోలాడుటల్ నైజమో?

‡వృకముం బోలి చరింప నేలమనసా?

వేడ్కన్ హరిం గొల్వుమా॥ 6.

శా॥ నానాయోనులఁ బుట్టిగిట్టుచును

నన్యాయంపు మార్గంబులన్।

నానా రీతుల సంచరించి కడువంతం

బొందఁగాఁ జేయుటల్।

నీనై జంబిదియంచుఁ దెల్పెదవు చాల్

నీచెల్మి నీకల్మియున్।

నేనాశింపఁగలేదు వెఱ్ఱిమనసా?

నెమ్మిన్ హరిం గొల్వుమా॥ 7.

మ॥ పలలంబున్ దినఁ జూచిడేగ; వలలో

బడ్డట్లు నీవ్రోరణం।

---

‡తోడేలు అనగా ముసలినక్క.

బుల మన్నింపుచు నాలిబిడ్డలపయిన్
మోహంబునన్ గుంది సం|
కెలలోఁ జిక్కితి మోసపోతినయయో!
క్రీడాప్తులం బెట్టగా|
ఫలితం బేమి గలుంగు మూఢహృదయా!
భక్తిన్ హరిన్ గొల్వుమా|| 8.

శా|| మేడల్ గట్టెద; భూములన్ గొనెద;
ఁబేర్మిన్ గీర్తిచే విత్తమున్|
గూడం బెట్టెదనంచుఁ గోరెదవయో!
గొంతెమ్మకోర్కుల్ వడిన్|
కూడున్ గుడ్డయుఁ దక్క వేరొకటి
నీకున్ గోరగానేల? ఛీ!|
*వ్రీడన్ జెందని జన్మమేల? మనమా
వేడ్కన్ హరిన్ గొల్వుమా|| 9

శా|| పాపంబుల్ సుఖమంచుఁజూపి భ్రమలన్
బంధించి యంతంబునన్
రూపుంజూపవు బాధలన్మునిఁగి
మొఱ్ఱో!. యంచు నేడ్వంగనీ|
కాపట్యం బికనేమి చెప్పుదుధరన్
గన్పట్టుఁ జోద్యంబులై|
వ్యాపారత్వమువాని మూఢహృదయా!
భక్తిన్ హరిం గొల్వుమా!|| 10.

*లజ్జ

శా॥ నీసాంగత్యముఁ బూనియుండఁ జనముల్
నిందించు మన్నారునన్।
దోసుండంచను మూర్ఖచిత్తుఁ డనుచున్
దుర్భాగ్యుఁడంచున్ భళా!
మోసంబయ్యెను దుఃఖముల్గలిఁగెని
ద్రోహాత్మ్యమున్ లేదుచాల్।
నీసాంగత్యముఁ గోరలేదు మనసా!
నెమ్మిన్ హరిం గొల్వుమా॥ 11.
శా॥ పల్లెల్, పట్నము, లిండ్లు, వాకిళులు, నే
పై యొప్పు సౌధంబులున్।
తల్లుల్, దమ్ములు, చెల్లెలన్న మఱుదుల్
దాయాద సద్బంధుగుల్।
కల్లజమ్మినుమంతయైన నిజమై
గనపట్టదెప్పట్టునన్।
మల్లుల్ ఫ్రోలి చలింప నేల? మనసా!
‡మాశ్రీహరిన్ గొల్వుమా॥ 12
శా॥ ప్రారబ్ధం బెటులుండు నట్టులనె
నైశ్వర్యంబు సేకూరునీ।
యారాటంబిటు పూననేల? పయిక౦
బార్జింప లేదంచుమున్।

---

‡లక్ష్మియుక్తుడైనటువంటి

రారాజోల్ చనలేదా? వెంటనొక
గోరంతైన గొంపోయిరే?॥
శ్రీరామాయని కేలుమోడ్చిమనసా
శ్రీశుఁ హరిం గొల్వుమా॥ 13.
శా॥ ఈజన్మంబునఁ గొల్వకున్న మరిసీ
కేజన్మ నొందబ్బునీ।
వేజన్మంబున నెట్టిపుట్టుదువొ?
నీకే రోగముల్మాడునో।
యూజిఁ నిల్చినబంటు జీవముకటా!
యూరాట మింకేల శ్రీ।
రాజా! యంచు నుతించి మూఢమనసా!
రాముఁ హరిఁ గొల్వుమా॥ 14
శా॥ *జుట్టుఁ గుజ్జుగఁ గత్తిరించి పయిపైఁ
"షోకుల్ చెలాయించి" మేఁ।
బట్టలగట్టుచు సెంటుతుంపురుల
నాపైఁజల్లిలేఁ జూపుతో।
§ఁజిట్టాడంగను జూతువిద్దిసతమా?
చేఁజిక్కవై నస్యతుం।
"డిట్టే" పాశముఁ జుట్టిలాగుమనమా!
యెట్లో హరిఁ గొల్వుమా॥ 15.

*Croping head. § Wandering.

మ॥ భవనంబుల్ మృదుపాన్పులున్ సుతులు
సత్పౌత్రుల్ ధరన్ గల్గినన్।
యువలన్ బంచయు వేతురంతమున న
నత్యైన్నత్వముం బొందివన్;
భువిసంపాదనఁ జేయు నంతవరకే
పుత్రుల్ హితుల్దారలుం।
చవలీలన్ గణుతించి మూఢమనసా!
యయ్యెన్ హరిన్ గొల్వుమా॥ 16.
శా॥ కొంపల్ దీయుచుఁ గోట్లెక్కుచు మహా
ఘోరంబులన్ జేయుచున్।
సంపాదించిన విత్తమెల్లయువతీ
సాన్నిధ్యమున్ జేర్పనిన్।
బంపున్ సూత్రముఁగూడఁ దెంచితుదకున్
బాపంబె తోడౌను చూ?
చంపల్ గట్టిగఁ గొట్టుకొంచుమనసా!
శక్తిన్ హరిన్ గొల్వుమా॥ 17
మ॥ పరకాంతామణులెల్లఁ దల్లులని
సంభావించి పైవిత్తమున్।
గరళ ప్రాయముగాఁగ నెంచుమని
వేడ్కన్ జెప్పసం బుద్ధులన్।
సరి; యట్లే యొనరింతునంచు; శిరము
త్సాహంబుతోఁ ద్రిప్పి సు।

స్థిరతౌ జ్ఞానముఁబొలనేల? మానసమా!
సేవ్యున్ హరిఁ గొల్వుమా॥ 18.

శా॥ చాంగల్ గ్రమ్ముఁగ బెక్కు బెక్కుమని
సంక్షోభంబుచేఁ గుండియా।
ల్గంగన్ వైద్యులు నిస్పృహాత్ములున
నిన్ గాంచన్ యముండంతలో।
"కంగార్పెట్టుచు" వచ్చునప్పుడయయో!
కన్పట్టరెవ్వారు మం౦।
గొంగున్ బంగరుమూఁటగాదె? మనసా!
క్షోణిన్ హరిన్ గొల్వుమా॥ 19

మ॥ సకలంబున్ గొరిగింపనేల? దొరవా?
సన్యాశివా? మోమునం।
దాకకొంచంబైనను బొట్టుఁబెట్టవది
యేమో? ముండవా? చూడదు।
శ్వకునంబంచు దలంతురేమొకద?
నీచంబైననీజీవనం।
ఔక సెక్కమ్మనినమ్మి మూఢహృదయా?
యీశున్ హరిస్ గొల్వుమా?॥ 20

మ॥ పరకాంతన్ గనియాసఁ జెందకయయో?
పాపంబె వాటిల్లున।
త్పురుషుల్ మెచ్చరు; ఛీ! యటంచునవనిన్
దూషింతురెల్లప్పుడున్।

గరవాలంబుల శిక్షసేయుఁబలు
ముక్కాల్గాఁగఁ గాలుండిసీ!।
పురుషుల్ పుట్టనియేవగించి మనసా
ప్రాజ్యహరిఁ గొల్వుమా॥ 21

మ॥ నరలోకంబునఁ బుట్టి మందమతివై
జ్ఞానంబు లేకున్ననే
సరణింబోదువా? దిక్కుమాలియకటా।
జన్మంబులెన్నో వ్రియుఁ।
వరుసఁ గల్గునో? వాటికన్నిటికి దే
ప్రాధాన్యమై యొప్పు; వే।
కరముల్ మోడ్చుచుఁ జెంతఁ జేరిమనసా!
కాంక్షన్ హరిఁ గొల్వుమా॥ 22

శా॥ భక్తుల్ జెందిరి రామచంద్రుపదముఁ
బ్రార్థించి సద్భక్తినా
సక్తిన్ వేడఁగ నీవుగూడ నటులే
సాధింపఁ గావచ్చుఁగ
క్తుర్తుల్ మానుముస్వల్ప సౌఖ్యములతో
గొట్లాట నీకేలఛీ।
యుక్తుల్ సెప్పఁకుమింక మూఢ మనసా!
యోజఁ హరిఁ గొల్వుమా॥ 23

శా॥ అందంబైన ముఖంబటంచుఁబలు
మారద్దంబులోఁ జూచిపో

లోనెందఱ్ దుస్తులుఁ గట్టిగంధమును
నత్యుత్సాహతఱ్ బూసి బల్।
చిందుల్ద్రొక్కెదవయ్యొ? కొట్టకొన
కర్చిన్ జేరు దేహంబు ఛీ! ।
పందుల్గూడను ముట్టఁబోవుమనసా!
భక్తిఱ్ హరింగొల్వుమా॥ 24.

శా॥ కాలం బెంతఁగ లేదు? కొందర
పడంగానేల? ముందెట్టులో।
శ్రీలోలుఱ్ భజియింతునంచుఁ దనలో
జింతింపఁగా నుగ్రుఁడై ।
కాలుండే మరుపాటునఱ్ గదిసి
జోకఱ్ ప్రాణముల్దీయనా।
వేళఱ్ జేయఁగ నేమికద్దు? మనసా!
వేడ్కఱ్ హరిఱ్ గొల్వుమా॥ 25.

శా॥ కార్యంబుల్సమకూడ నేనని
యహంకర్తృత్వముం బూనియు।
కార్యంబుల్జెడిపోవఁ గర్మమని, లో
గా దైవముఱ్ దూరుచుఱ్।
ధైర్యంబెయ్యెడ లేకఁ జేయుదువయో?
తర్కింప నింకేల? నీ।
వార్యల్ గొల్చిన రీతిమూఢహృదయా!
హాళిఱ్ హరింగొల్వుమా॥ 26.

శా॥ ఏపాపంబులఁ జేసినావొ యటులే

యిక్కట్లు ప్రాప్తించునీ।

వేసారంగనుబుద్ధితోఁ గలసి ఛీ!

యింకేల సంసారము।

ఆపద్బాంధవునిం గొల్వకున్నఁ గలదే?

యాధారమయ్యయ్యొ? ని।

ష్టాపత్వంబున సేవఁ జేసి మనసా!

భక్తిన్ హరిన్ గొల్వుమా॥ 27.



(మనోపరమున్న విటకానిపరమున్న)

—:బ్యాంఘుస్వరం:—

బిళ్హరిరాగం-ఆదితాళము.

రాముని పదములు మరువకుమా! రంగేళిగాఁదిరుఁగ
కుమా॥ పల్లవి॥

కాముకులందరు బడిమొదుపాట్లు కన్నులఁ జూచుచు
నుండఁగలేదో?॥రా॥ అనుపల్లవి.

ఘడియ ఘడియకు మారెదవేమె ఘడియో?
క్షణమొ? నీబ్రతుకు। మిడిసి మిడిసి పడిమెదవయ్యో
మిథ్యయనినమ్ముమా! ॥రా॥ ౧.

ఎందరెంద రేగుటయో మందమతి! గానవా?
కందుకమువలెఁ దూలికానఁగరావు క్రిందుమీఁదు
॥రా॥ ౨.

పాపమన్న భయములేదు పాపినిన్ను జూడఁగరా
దు। రూపుమావెద నిన్నుబట్టి పో! పో! పురము వె
డలి॥రా॥ ౩.

ప్రేమమీర, రాఘవునేలు రాముడుండ నేమికో
దువ కామితార్థము లొసఁగు నీకుఁగాననమ్ము; నా
మాట ॥రా॥ ౪.

శంకరాభరణము-ఆదితాళము.

కాటికిఁ బోయేనరునకు నీకు సొగసు లేటికే॥పల్లవి॥

ధాటిగశ్రీరామరామరామయంచు దలచవేటికి ॥అ
నుపల్లవి॥

సబ్బుతోడఁ దోమి నిబ్బరంపు నడక తబ్బిబ్బులా
డుచు నడిచేవురా?
గొబ్బున యమభటులు గొరగొర నిన్నీడ్వ "స
బ్బుగిబ్బు" లన్ని యేమాయెనయా ॥కా॥ 1.

మల్లుపంచఁ గట్టి మల్లిపూల బెట్టి చల్లని వెన్నెల
దిరిగేవురా?
ముళ్లరాళ్లలోన కింకరులీడ్వఁగ వళ్లి మళ్లల
న్ని యేమాయెనయా ॥కా॥ 2.

కాంతలఁ జూచుచు వింత "ముస్తాబై" సంతసప
డియెదువేల?
అంతకుండు నిన్ను హంతయొనర్పఁగ వింతము
స్తాబంత యేమాయెనయా? ॥కా॥ 3.

దేవుడు లేదు; దెయ్యము లేదు; పోవోయి "నా
న్సెన్స" నెదు।
చావుకుసిద్ధమైయున్న నిన్బాధింప పోవోయి నా
న్సెన్సే మాయెనయా ॥కా॥ 4.

రయమున భక్తులఁ గాచునని వీరరాఘవదాసుఁ
డు సెప్పె;
నయముమీర రామనామముఁదలచిన భయము
లన్ని తొలఁగి పోవునయా ॥కా॥ 5.

సంపూర్ణము.

